భాగతము సార్థకముగ కన్నడీకరించినది. కృతియందు కొన్ని యెడల బంధము శిథిలమై యున్నది. వినుగెత్తించు బోధనలున్నవి. కథా దృష్టితో సామాన్యమనదగు కథనమున్నది. కాని మొత్తముమీద ప్రదర్శించిన ఉత్కటత, సజీవత్వము, ప్రతిభ, దేశి సహజత—అన్నిటి కంటె మించిన అద్భుత తాదాత్మ్యము – వీనితో కుమారవ్యాస భారతము కన్నడ మహాకృతులలో ఒకటై నిలిచినది.

కుమార వ్యాసయుగమనబడు 12–14 శతాబ్దముల మధ్య కాలమున శివకవులగు చామరసు, నిజగుణ శివయోగి, ముప్పిన షడక్షరి, సర్పభూషణ శివయోగి, సర్వజ్ఞుడు మున్నగువారు వెలసిరి. విశ్వధర్మము నిత్య నీతియందు వుండవలసిన సద్గుణములను సర్వజ్ఞుడు మరల మరల చెప్పినాడు. కురళ్ వ్రాసిన తిరువళ్ళువర్‌వలె, తెలుగువారి వేమనవలె కన్నడిగుల జనప్రియకవి సర్వజ్ఞుడు.

శివశరణుల వచన వాఙ్మయమువలె ప్రజలలో పాదుకొన్న దాస వాఙ్మయమునకు ఆద్యులు నరహరి తీర్థులు. సంకీర్తనాచార్యుడగు పురందరదాసు త్యాగరాజుకు స్ఫూర్తి నిచ్చినవాడు. అసంఖ్యాకములైన భక్తి కీర్తనలను రచించిన మహనీయుడు పురందరదాసు

కనకదాసు, జగన్నాథదాసుల తరువాత భాగవత కవులగు కుమార వాల్మీకి, జైమినీ భారతకర్త లక్ష్మీశకవి, చిత్రభారత కర్త గోపకవులను గురించి జైనకవి రత్నాకర వర్ణిగారల రచనల విశేషాలను గ్రంధకర్త చక్కగా వివరించినారు

'మధ్యకాలము—మూడవ భాగము'న షడక్షరి, తిరుమలార్య, సంచియ హొన్నమ్మ, ముద్దణ, మున్నగువార్ల రచనల విశేషాలను పేర్కొన్నారు. హొన్నమ్మ రచించిన 'హది బదెయ ధర్మ' సతీ ధర్మములను వివరించు కావ్యము. ముద్దణ రచించిన రామాశ్వమేధ కావ్యము భార్యాభర్తల సంవాద రూపములో సాగిన రామకథ.

కొత్త సారస్వత కవుల తొలిమెట్టు (క్రీ. శ, 1820–1920) కొత్త సారస్వత కవుల మలిమెట్టు (1921-1958) అను శీర్షికల క్రింద కన్నడములో నవీన సాహిత్యోదయ చరిత్రను విపులంగా చర్చించినారు. కొత్త కావ్యము శీర్షికలో శ్రీ బి. యం శ్రీ కంఠయ్య, గోవిందపై డి. వి గుండప్ప శ్రీనివాస (మాస్తి వెంకటేశ అయ్యంగార్) పాలి రామచంద్రరాయ, దత్తాత్రేయ రామచంద్ర బేంద్రె, ఆనందకంద, మధురచెన్న, వి సీతారామయ్య కువెంపు, పు. తి. నరసింహాచార్య, జి పి. రాజరత్నం, తీ నం శ్రీ కంఠయ్య, కడెంగొడ్లు శంకరభట్ట, వి. కె. గోకాక్ (వినాయక) రం. శ్రీ ముగళి (రసికరంగ) ఈశ్వర సణకల్, కె. యస్. నరసింహస్వామి గోపాలకృష్ణ అడిగ, చెన్నవీర కణవి, జి. యస్. శివరుద్రప్ప మున్నగు వారల కవితలలోని వైశిష్ట్యమును చక్కగా సమీక్షించినారు.

'చిన్నకథ—నవల' అను శీర్షికలో మాస్తి వెంకటేశ అయ్యంగార్, ఎస్. జి. శాస్త్రి, శివరామకారంత్, దేవుడు నరసింహశాస్త్రి, సి. కె. వెంకటరామయ్య, అ. న. కృష్ణారావు, గొరూరు రామస్వామి, అయ్యంగార్, బేంద్రె, కువెంపు, పు తి. న. తరాసు, నిరంజన, రాజరత్నం, బీచిగార్లు కథానికా సాహిత్యమునకు సమర్పించిన కృతుల సమీక్షతోపాటు యిటీవల వారైన ఈశ్వరన్ వరదరాజ హుయిల గొళ, వ్యాసరాయ బల్లాళ, మున్నగు వారిని పేర్కొన్నారు.

కన్నడ నవలా రచయితలలో శివరామకారంత్ అగ్రగణ్యులు అరువదికి మించిన వారి నవలలలో 'మరళి మణ్ణిగె' ('మరల సేద్యానికి' తిరుమల రామచంద్రగారిచే తెనిగింపబడినది) చోమన దుడి అత్యంత ప్రసిద్ధములు భారతదేశమునకు గర్వకారణమగు కన్నడ నవలా రచయితలలో కారంత్ ఒక్కరనుట నిక్కము అన్నారు డా. ముగళి.

నవలా రచయితలలో కువెంపు, అ. న. కృష్ణరావు, దేవుడు, తరాసు, బసవరాజు కట్టీమనె, కృష్ణమూర్తి, పురాణిక్, మిర్జి అణ్ణారాయ, ఎం. వి. సీతారామయ్య, శీరంగ, కె. వి. అయ్యర్, గోకాక్, మున్నగువారు. నాటక కర్తలలో బి యం. శ్రీ డి వి గుండప్ప, మాస్తిగార్లు. ఆధునికులలో టి. పి. కైలాసం, ప్రసిద్ధులు. కైలాసం రచనలను సమీక్షిస్తూ గ్రంధకర్త 'భారతీయ' విశ్వ వాఙ్మయ చరిత్రలో కైలాసం ప్రతిభ అగాధము, ఉజ్వలము అని నిస్సందేహంగా చెప్పవచ్చును అన్నారు.

ఆద్య రంగాచార్య, శివరాయ కారంత్‌సంస, కువెంపు, ఎం. ఆర్. శ్రీనివాసమూర్తి, బేంద్రెగార్లు, చక్కని నాటకాలెన్నో రచించినారు.

'వ్యాసములు—ఇతర గద్యములు' అను శీర్షికలో వివిధ రీతుల గద్యరచనలను వెలువరించిన రచయితలను—వారి రచనలను పేర్కొన్నారు. ఉపసంహార వాక్యములలో గ్రంధకర్త 'కన్నడిగులు సర్వమందరి అన్ని ఉత్తమ సారస్వతములనుండి స్ఫూర్తి పొందినట్లే, ఇతరులు కూడ కన్నడ సారస్వతములోని మంచి భాగములనుండి స్ఫూర్తినొందుదురు గాక' అనటం వారి సమన్వయ దృష్టికి సంకేతము.

గ్రంధకర్త డా. రం. శ్రీ ముగళి సంగ్రహంగా అయినప్పటికీ ప్రధాన ఘట్టాలను చక్కగా చర్చించుటతోపాటు తమ అభిప్రాయాలను కూడ తెల్పినారు. ఈ విధంగా యీ రచనలలో సద్విమర్శను కూడా సాగింది. ఎం. ఎస్. మహంతయ్యగారి అనువాదం సరళంగా వుంది. బసవేశ్వర వచనముల కొన్నిటి అనువాదం హృద్యంగావుంది.

కన్నడ భాషేతరులైన విద్వాంసులనే కాక సామాన్య పాఠకులను కూడా అలరించే చక్కని రచన యిది

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి



Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

# అమృతాంజన్ లిమిటెడ్

## 75 సంవత్సరాల పైగా గృహౌషధములు తయారుచేస్తున్నారు!

- **అమృతాంజనం బాధానివారిణి**
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- **అమృతాంజన్ గ్రైప్ మిక్చర్**
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- **అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంట్**
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- **అమృతాంజన్ ఇన్‌హేలర్**
  జలుబు చేసి ముక్కు దిబ్బెడ, తుమ్ములు వగైరాలకు.
- **అనోలియమ్-కోల్డ్ రబ్**
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- **శాలోఫెన్ - బాధానివారిణి మాత్రలు**
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.

**...ఇండియాలోను, ఇతర దేశాలలోను పేరు పొందినవి.**

అమృతాంజన్ లిమిటెడ్

